# పరిచయం



పేరు : వారణాసి సూర్యకుమారి

జననం : 1941

తల్లిదండ్రులు : భాగవతి సుబ్బారావు గారు, సత్యవతి గారు

జన్మస్థలం : ద్రాక్షారామం

భర్త : శ్రీ వారణాసి లక్ష్మీజయప్రదన్ (మేజర్)

పిల్లలు : నలుగురు

పెద్ద అమ్మాయి : డా॥ శోభ - పెద్దల్లుడు - డా॥ బి.డి.సి.ఎన్. ప్రసాద్

చిన్న అమ్మాయి : డా॥ శైలజ - చిన్నల్లుడు - డా॥ ఎస్.వి. రమణ

పెద్ద అబ్బాయి : డా॥ పినాకపాణి - కోడలు - డా॥ నాగలక్ష్మి

చిన్న అబ్బాయి : డా॥ చక్రపాణి - కోడలు - శ్రీదేవి

మనుమలు : వంశీ, వరుణ్

మనుమరాండ్రు : నీలోత్పల, మనోజ్ఞ, వర్షిణి, హర్షిణి

రచనలు : గోవింద శతకము, శ్రీరామ కథాసుధ, సూర్య కిరణాలు,
కవితారామం (పద్య కవితలు), కథల సంపుటి, 'మానినీ మానసం'
వేణునాదం

నవలలు : (అముద్రితాలు)

పురస్కారం : 'ఆంధ్ర సారస్వత సమితి' ఉగాది పురస్కారం, పద్య రచనకు 2009లో
'సాహితీ మిత్రుల సంస్థ' తరపున మిత్రులందరు 'కొత్తపూలు'
కవితల సంకలనం అంకితం యివ్వడం.
'మన బందరు' పుస్తకమునకు గౌరవ సంపాదకత్వం వహించుట.

ఆకాంక్ష : ఇంకా ఎన్నో ఎన్నెన్నో (వ్రాయాలని)

1. ఆంధ్ర సారస్వత సమితి, సాహితీ మిత్రులు,
ఉదయ నడక మండలిలో శాశ్వత సభ్యత్వం.
2. ఉదయ నడక మహిళా విభాగం ప్రెసిడెంటుగా, మహిళా
మండలిలో పెసిడెంట్‌గా సేవా కార్యక్రమాలు నిర్వహించడం

వి బందరు కళ్యాణి ప్రెస్, మచిలీపట్నం. Ph : 223404

# సూనృత మంజరి

## (కందాలు)



వారణాసి సూర్యకుమారి

V. S. Kumari

# సూనృత మంజరి

(కందాలు)

వారణాసి సూర్యకుమారి



సాహితీ మిత్రులు

మచిలీపట్నం

# సూనృత మంజరి

**కందాలు**

రచన :
**శ్రీమతి వారణాసి సూర్యకుమారి**
21-562-3, పరాసుపేట,
మచిలీపట్నం - 521 001

హక్కులు : **కవయిత్రి**
ప్రచురణ : జనవరి 2011

ప్రచురణ సంఖ్య : 78
వెల : రూ. 20/-

ప్రతులకు :
**శ్రీమతి వారణాసి సూర్యకుమారి**
21-562-3, పరాసుపేట, మచిలీపట్నం-521 001
ఫోన్ : 08672 - 251741

ముద్రణ :
బందరు కళ్యాణి ప్రెస్, మచిలీపట్నం-1



# "సూరి" అంటే సూర్యకుమారి

"కష్టజీవి"కి ఇరువైపులా రక్షణగా వుండేవాడు కవి అన్నారు. "సూర్యకుమారి"కి ఇరువైపుల ఉన్న కవి సూరి. సూరి మకుటంతో సూర్యకుమారి రాసిన సూరి శతకం ఈ సూనృత మంజరి. "సూనృతమంజరి" అనే నామధేయానికి కూడా ఇరువైపుల ఉన్నవారు సూరి. అదీ విశేషం. అందుకే ఈ శతకానికి "సూనృతమంజరి" అని నామకరణం చేశారు సూర్యకుమారి.

ఎప్పుడో చదివిన చదువు పదో తరగతి. షష్టి పూర్తి తరువాత అమెరికాలో పిల్లల దగ్గరున్నపుడు విరామ సమయాన్ని గ్రంథ పఠనానికి, కవిత్వ రచనకు ఉపయోగించుకున్నారు సూర్యకుమారి. కేవలం గృహిణిగా వుంటూ పద్యరచనపై ఆసక్తి పెంచుకొని ఇప్పటికే అనేక పద్య గ్రంథాలు రచించారు. ఇప్పుడు కంద పద్య శతకం అందిస్తున్నారు.

"కందము రాసిన వాడినే కవి" అన్నారు పెద్దలు. కంద పద్యం రాయటం చాలా కష్టం అని వారి ఉద్దేశం. నిజమే. కంద పద్యంలో నాలుగు మాత్రాగణా లుండాలి. బేసి గణంగా జగణం రాకూడదు. రెండు నాలుగు పాదాల చివర గురువు రావాలి. రెండు నాలుగు పాదాలలో మధ్య గణం- నగణం కాని, జగణం కాని రావాలి. రెండు, నాలుగు పాదాలలో యతి మైత్రి వుండాలి. నాలుగు పాదాలకు ప్రాస నియమం వుండాలి... వగైరా లక్షణా లన్నీ తు.చ. తప్పక పాటించి అలవోకగా కంద పద్యరచన సాగించిన సూర్యకుమారి పద్యం రాద్దామనుకొనేవారికి స్ఫూర్తి దాయకంగా నిలుస్తున్నారు.

నేడు ప్రపంచంలో నడుస్తున్న చరిత్రను తమ పద్యాలలో చక్కగా చిత్రించారు సూర్యకుమారి. ఎన్నో సూనృతాలు తెలియజేసారు. ఎంతో సామాజిక వాస్తవికతను, ఎన్నో విలువల్ని ఈ పద్యాలలో మనం గమనించవచ్చు.

"సూర్యకుమారి" మా మచిలీపట్నం "సాహితీమిత్రులు" సంస్థ జీవిత సభ్యురాలు, కార్యవర్గ సభ్యురాలు కూడా. సంస్థకు వారందిస్తున్న సేవలు మరువరానివి. ఒక కార్యకర్తగా పనిచేస్తూ ఎందరికో స్ఫూర్తిదాయకంగా నిలుస్తున్న సూర్యకుమారిని అభినందిస్తున్నాను. ఈ గ్రంథాన్ని మా సంస్థ ప్రచురణగా వెలువరిస్తున్నందుకు కూడా వారికి సంస్థ కార్యవర్గం పక్షాన కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను. మరింకా మరెన్నో కావ్యాలు రాయాలని శుభాకాంక్షలు అందిస్తున్నాను.

మచిలీపట్నం
23-12-2010

**డా॥ రావి రంగారావు**
వ్యవస్థాపక అధ్యక్షులు, సాహితీమిత్రులు



# "సూర్యా"భినందన

ప్రస్తుత సమాజపు తీరుతెన్నులను విశ్లేషిస్తూ... మానవీయ విలువలకు, సాంఘిక కట్టుబాట్లకు, సంప్రదాయ ధర్మాలకు నూకలు చెల్లాయని చాలామంది పెద్దలు పెదవి విరుస్తున్నారు. నేటి సమాజానికి హితవు చెప్పే వ్యక్తులు కాని, మార్గదర్శకత్వాన్ని సూచించే పెద్దలు కాని అంతగా కానరావడం లేదనేది వీరి అభిప్రాయం. వ్యవస్థ అపమార్గంలో పయనిస్తున్నప్పుడు దానిని సరిదిద్దాల్సిన బాధ్యత, ధర్మపథంలో పయనించే విజ్ఞులపై ఎంతగానో ఉంది. ఈ బాధ్యతను గుర్తెరిగినవారు శ్రీమతి వారణాసి సూర్యకుమారిగారు.

సూర్యకుమారిగారు సంప్రదాయ కుటుంబంలో జన్మించారు. చదువుకున్నది పదవ తరగతి అయినా, ప్రపంచాన్ని కూలంకషంగా అధ్యయనం చేసిన అపారమైన జ్ఞానం, అనుభవం, పరిణతి, వయస్సు ఆవిడకు ఉన్నాయి. ఈ అనుభవసారాల నుండే ఆమె, ఒక ఉత్తమ గృహిణిగాను, సాంఘిక బాధ్యతలను గుర్తెరిగిన మంచి పౌరురాలుగాను, తనను తాను తీర్చిదిద్దుకున్నారు. పాండితీ ప్రకర్ష గల వ్యక్తుల సాహచర్యంతో, సమకాలీన కవుల కవితా బోధనలను ఆకళింపు చేసుకుంటూ చిన్ననాటి నుండే ఛందోబద్ధ కవిత్వాన్ని రాసే అద్భుతమైన శక్తిని అలవరుచుకున్నారు. పై పెచ్చు నిరంతర గ్రంథ పఠనాసక్తి ఆవిడకు మరింత లోకజ్ఞానాన్ని అందించింది. కుటుంబ సభ్యుల నిరంతర ప్రోత్సాహం, సహకారం ఆవిడకు మరింత జవసత్వాల్ని అందించాయి. వయస్సు భారాన్ని సైతం లెక్కచేయని ఒక నూతన ఉత్తేజాన్ని, శక్తిని కలిగించాయి. ఈ ఒరవడిలో ఆమె అందించిన మనోజ్ఞమైన, ఆలోచనా ప్రేరితమైన **సూనృతమంజరి** పద్య మాలికలు విశిష్టమైనవి, సాంఘిక ప్రయోజనం కలిగినవి.

సూనృతమంజరి మకుటంతో ఆవిడ రచించిన కంద పద్య సంపుటి (168 పద్యాలు) సరళశోభితంగా ఉంది. జీవన ధర్మాలను, సత్యాలను, రహస్యాలను, వ్యక్తిగత, కుటుంబ, సమిష్టి, సాంఘిక బాధ్యతలను చాటిచెప్పే విభిన్న జీవన సూత్రాలు ఈ కంద పద్య మాలికలలో నిక్షిప్తమయ్యాయి. నాటి సుమతీ శతక, వేమన శతక, భర్తృహరి సుభాషితాలు అందించిన సూక్తుల సుధానీతి సారాన్ని, ఆమె చాలామేరకు ఒడిసి పట్టుకొని, ఈ నాటి సమాజానికి ఉపయుక్తంగా ఉండేలా తన రచనను సాగించారు. నేటి తరం విద్యార్థులు ఈ నీతి పద్యాల్ని వల్లె వేయాల్సిందే! హృదయంలోకి తీసుకోవాల్సిందే! ఆచరించి తీరాల్సిందే!

కష్టతరమైన కంద పద్య ఛందోబద్ధ నియమాల్ని పాటిస్తూనే, క్లిష్టమైన పదాలను అవసరం మేరకే వాడుతూ, సరళమైన భాషలో సాగించిన ఈ పద్య రచనను పాఠకులు సమాదరిస్తారని నా ప్రగాఢ విశ్వాసం. సాహితీ విలువలు, సామాజిక దృక్పథం సమపాళ్ళలో మేళవించిన సూనృతమంజరి ప్రతి ఇంటా ఉండవలసిన పుస్తకం. పెద్దలు చదవటమే కాదు, ఈ సూనృతాలను పిల్లలచేత కూడా చదివించాల్సిన బాధ్యత ఉంది. వృద్ధాప్య దశలో సైతం ఆరోగ్యాన్ని లెక్కచేయక తనకు తెలిసిన "హితాన్ని" పదిమందికి పంచాలన్న 'సూరి'గారి తపనకు మనఃపూర్వకమైన అభినందనలు. ఆ తపనే ఆవిడకు పరిపూర్ణ ఆరోగ్యాన్ని ప్రసాదిస్తుందని నా ప్రగాఢ విశ్వాసం. వారి కలం మరిన్ని మంచి రచనలను అందించాలని మనసా వాచా కోరుకుంటున్నాను.

మైనేని కేశవ దుర్గాప్రసాద్

ఆచార్య మైనేని కేశవ దుర్గాప్రసాద్
ఉపకులపతి, కృష్ణా విశ్వవిద్యాలయం

తేది : 10-01-2011



# అంతర్వాణి

చ॥ నుతజలపూరితంబులగు నూరిటికంటె 'సూనృత'
ప్రవత్మమొక బావిమేలు! మరి బావులు నూరిటికంటె నొక్క స
త్క్రతు వదిమేలు! తత్క్రతు శతంబుకంటె సుతుండు మేలు, త
త్సుతశతకంబు కంటె నొక సూనృతవాక్యము మేలు చూడగన్
(ఆదిపర్వం 4-24)

నన్నయ భారతంలోని పద్యమిది. శకుంతల తననీ, తన పుత్రుడినీ స్వీకరించమని దుష్యంతుడిని కోరుతున్న సందర్భం. ఇందులో 'సూనృతము' (సత్యవాక్కు) కున్న ప్రాధాన్యత చక్కగా చెప్పారు. అలాగే మాట్లాడేటప్పుడు ధర్మయుక్తమైన మాటలు సూటిగా, మనసుకు హితంగా, ప్రియంగా మేలును కూర్చేవి, సత్యమైనవి తీయగా మంచి మాటలు చెప్పాలి అని కూడా అన్నారు నన్నయగారు ఇంకో పద్యంలో. భారతం కేవలం ఇతిహాసం కాదు. లోకహితమే లక్ష్యంగా పంచమవేదంగా ప్రసిద్ధమైంది.

పై పద్యం చదివిన తర్వాత నాకు తోచిన మంచిమాటలు చెప్పాలనిపించింది భావితరాలవారికి. చెప్పగా చెప్పగా నూటికొక్కరు 'మంచి'ని గ్రహించినా నా ప్రయత్నం సఫలమైనట్లే కద! 'తినగ తినగ వేము తియ్యనుండు' అన్నట్లుగా వినగా వినగా నచ్చువచ్చు. అమాయకంగా నిప్పును ముట్టుకోబోతున్న పసివాడిని వారించకుండా ఉండలేము కదా! సామ, దాన, బేధ, దండోపాయాలనైనా, 'తప్పుదారిని పట్టబోయిన యువతను' సన్మార్గపరులుగా చేయడానికి ప్రయత్నించడం ధర్మం. తరుణోపాయం సూచించడం పెద్దల కర్తవ్యం కూడా!

అందరూ శ్రీరామచంద్రుడిలా పితృనాజ్ఞానువర్తులై ఉండలేకపోయినా తమకు 'మంచి'ని చెప్పే తల్లితండ్రుల, గురువుల, పెద్దల మాటలలో సారుశ్యం గ్రహిస్తే వారికే మంచిది.

నిజానికి అన్నీ మనకు తెలిసిన నిజాలే. క్రొత్త సంగతులేమీ లేవు. క్రొత్తగా చెప్పునవీ లేవు. కానీ 'సత్యసూక్తులు' నెమరువేసుకోడంలో తప్పు లేదుకదా! 'ఉప్పూ, కప్పురమూ ఒక్కపోలికనున్నా గుణవిశేషములనుబట్టి తేడా ఎలా గ్రహించగలమో మంచీ, చెడూ కలబోసిన మనుష్యులలో మంచివారిని గుర్తించాలి అని వేమనగారు ఏనాడో తెలిపారు.

నేటి సమాజంలోని మంచి-చెడులను గుర్తించలేకపోతున్న ఈనాటి వాతావరణంలో యిమిడి సుఖజీవనం సాగించాలంటే మంచి నేర్పు, ఓర్పు అవసరం. అందుకు 'పెద్దలమాట చద్దిమూట' అన్న చందాన యువత నడవడిక ఉంటే ఆత్మస్థైర్యం అలవడుతుంది. అనుకున్న పురోభివృద్ధి సాధించగలుగుతారు. మహాత్మాగాంధీగారు "సత్యం, అహింసలే నా మతం, సత్యమే నాకు దైవం" అన్నారు. "చెడు అనకు, 'వినకు' 'కనకు' అంటూ మంచిమార్గం సూచించారు. అలా చెడుకు దూరంగా ఉంటే అంతా 'మంచే' కదా!

ఏదో నాకు తోచిన మంచిమాటలు చెప్పాలనిపించింది. పద్య రచనలో నాకున్న ఆసక్తికొలదీ కష్టపడి 'కందపద్యాల'లో మీముందుంచాను. కఠిన పదజాలంతో, సమాసభూయిష్టంగా రచన కొనసాగించగలట్టి ఆ శక్తి లేకపోయినా చిరుచిరు పదజాలంతో చిన్నిచిన్ని 'కందము'లు వ్రాసి అందరితోనూ చదివించాలనే యిష్టంగా ప్రయత్నం చేశాను. అయిష్టంగానైనా చదివితేమాత్రం నా తాపత్రయం స్పష్టమౌతుందని మాత్రం చెప్పగలను.

మా అత్తగారు శ్రీమతి వారణాసి కామేశ్వరమ్మగారు అసహాయస్థితిలో అనారోగ్యంతో మంచంమీద ఉండి సపర్యల నిమిత్తం మాటిమాటికీ పిలిచేవారు 'సూరీ' అని. నీపూర్తిపేరు పిలువలేను ఏమనుకోకు అన్నారు ఒకసారి. అటువంటి ఉత్తమురాలిని స్మరించుకుంటూ నాకు నేనే చెప్పుకుంటున్నట్లు ఒకసారి మనసులో అనుకున్నాను. అదే మకుటంగా పెట్టి వ్రాయడం జరిగింది. సహృదయంతో ఈ రచనను స్వీకరించగలరని ఆశిస్తున్నాను.

క్రిష్ణా యూనివర్సిటీ వైస్ ఛాన్సలర్ ప్రొఫెసర్ మైనేని కేశవ దుర్గాప్రసాద్ గారు అడిగిన వెంటనే సహృదయంతో అంగీకరించి తమ అమూల్యమైన సమయం వెచ్చించి ముందుమాట రాసియిచ్చినందులకు వారికి నా కృతజ్ఞతలు.

ఈ 'సూనృత మంజరి'కి ముందుమాటలు వ్రాసియిచ్చిన డా॥ రావి రంగారావు గారికి కృతజ్ఞతలు.

పుస్తకమును అందంగా తీర్చిదిద్దిన 'బందరు కళ్యాణి ప్రెస్' వారికి అభినందనలు.

**వి. సూర్యకుమారి**



# అంకితం



1 కమ్మని దీవెన లీయగ
అమ్మను మించు నొరు దైవ మవనిని గలదా!
నెమ్మది సంతతికి శుభము
లిమ్మని సతతమ్ము వేడు నీశుని అమ్మే ॥

2. క్రమశిక్షణకై కఠినత
మమత కలగలిపి కనబడు మజ్జనకులగున్
సమయస్ఫూర్తి చతురతల
సుమధురవాగ్ధాటి పటిమ చూపెడు నిపుణుల్

3. ఆడెడి పాడెడి వయసున
తోడున్ నీడై భవితను దొడ్డగ మలచెన్
నే డేరీ? మమ్ము వదలి
ఏడేడు భువనములందు నెందున కలరో!

**మాతాపితరులు**
**శ్రీమతి వెంకట సత్యవతి - శ్రీ భాగవతి వెంకట**
**సుబ్బారావు గార్లకు**

గౌరవాభిమానములతో

వారణాసి సూర్యకుమారి



## గణేశా

కం॥ గణనాయక! నిను నమ్మిన
గణనీయ ప్రతిభను పొందగలము గణేశా ।
అణకువయు భక్తిశ్రద్ధలు
గుణవంతుల లక్షణములు కూరిమి నిడవే ॥



## సరస్వతి

కం॥ వాణిని కచ్ఛపి వీణా
పాణిని చదువులకు తల్లి పద్మభవునకున్
రాణిని నా హృదయ మ్మను
వీణియ శృతి జేయు మనుచు వేడెద నమ్మా ॥

కం॥ మణిమయ వీణియ కరమున
మణిమాలను కంఠమందు మకుటము శిరమున్
గణనీయ శోభ నగణిత
అణిమాదుల సిద్ధి నిచ్చు నంబయె సూరీ ॥



# సూనృత మంజరి

ఏకాగ్ర చిత్తమందున
లోకేశ ధ్యాన మున్న లోటుండ దికన్
లోకాతీత సుభక్తిని
ఏ కాలము నైన మెచ్చు నీశుడు సూరీ ॥ 1

మానవ జన్మ సమానము
కానము ఈ సృష్టిలోన కావున నరుడున్
తా నాదర్శముగ బ్రతుక
బూనగ సన్మార్గ మెంచ పుణ్యము సూరీ ॥ 2

ధర్మము తప్పని నడతయు
మర్మము లేనట్టి మాట మనసున తలపుల్
నిర్మల భక్తిని నిండుగ
కర్మాచరణము సఫలము గానగు సూరీ ॥ 3

కూడును, గుడ్డయు, గూడును
వేడుకొనెడి వారి కెల్ల వెలితిని దీర్పన్
తోడున్ నీడగ నిలిచిన
నాడే దైవమ్ము మెచ్చు నమ్ముము సూరీ ॥ 4

అన్నార్తు లందు కలడట
చిన్నారులలో గలండు శ్రీరాముడనన్
ఉన్నాడను విశ్వాసము
కన్నను భగవాను డింక కలడా సూరీ ॥ 5

సరసిజనాభుని సంకట
హరణుని సేవించి పొందు హర్షముకంటెన్
నరులకు వేరొండు కలద?
తరుగని పుణ్యమున వారు ధన్యులు సూరీ ॥ 6

శోధన చేయగ నెంచిన
సాధనతో మాత్రమె యగు సాధ్యము సుమ్మీ ।
మాధవుని తలచి గీతా
బోధనలు మరువక లబ్ధి పొందుము సూరీ ॥ 7

ధ్యానమ్మున నిలకడయును
దానముచే పుణ్య మంత తప్పక పొందున్
మానవులే పరిపూర్ణులు
జ్ఞానులు కాగలరు జగతి నమ్ముము సూరీ ॥ 8

కష్టసుఖమ్ముల కలయిక
స్పష్టమె జీవితమునందు సమ భావనతో
నష్టము లాభము నీశుడె
ఇష్టము భరియించు శక్తి నిచ్చును సూరీ ॥ 9

దేవాలయంబు దేహమె
భావనను గలట్టి యాత్మ పరమాత్మ యగున్
నీ వాచరించు సకలము
సేవగ నర్పించుటెయన జెల్లును సూరీ ॥ 10

అవసాన కాల మైనను
భవసాగర మీది మంచి మార్గము నడువన్
నవ జన్మకు పుణ్య ఫలము
సవరించును నీ మనుగడ చక్కగ సూరీ ॥ 11

బ్రతుకు క్షణ భంగురమని
గతజన్మను పాపపుణ్య కారక మీ జీ
విత మను నాధ్యాత్మికతను
మత మేదైనను గ్రహించ మంచిది సూరీ ॥ 12



సత్సంగీతము తోడను
సత్సాంగత్యమ్ముచేత సకల జనులకున్
మత్సర మణగును మనసున
ఉత్సాహము నురక లెత్తు నుర్విని సూరీ ॥ 13

ఖేదము నిడు సంవాదము
మోదము కల్గించు నాదము వినోదమ్మున్
భేదము రాకుండుటయే
వేదమని తెలియుటె చాలు వివరణ సూరీ ॥ 14

యోగాభ్యాసము చేయుట
రాగాలాపనను జేసి రాణించుటయున్
సాగిన, సుశిక్షితు లగుచు
కాగల రారోగ్య భాగ్య ఘనులుగ సూరీ ॥ 15

రసరూప శబ్దగంధము
అసలగు స్పర్శకును నరుడు ఆకర్షితుడౌ
వ్యసన మరికట్ట గలిగిన
మసలును పంచేంద్రియములు మంచిగ సూరీ॥ 16

రాధామాధవుల నెరుగ
సాధారణ మానవులకు సాధ్యం బగునే!
మేధావులు చెప్పగ విని
తాదాత్మ్యత నొందనగును ధన్యత సూరీ ॥ 17

చల్లని రామయ్యా మరియు
అల్లరి కృష్ణయ్య రెండు అవతారములన్
కొల్లగ భేదము లున్నను
ఉల్లమునగొలువ నిరువురు ఒకటే సూరీ ॥ 18

మధనమ్ము బ్రతుకు సంద్రము
సుధ లూరించు నొకపరిని సుఖసంతసముల్
వ్యధ చిందించు నొకపరిని
విధి యాడెడు నాటకమ్ము వింతయె సూరీ ॥ 19

చీకటివెలుగుల సమయము
పోకడ రాకడల శాస్త్రము నెవరెరిగినన్
లోకేశుడె నియమించును
ఆకాల నియంత్రణమ్ము అవనిని సూరీ ॥ 20

ఆరోగ్య సూత్రములతో
శారీరక రుగ్మతలను సరిజేయ నగున్
చేరిన చిత్త క్షోభము
జారును శ్రీరామనామ జపమునె సూరీ ॥ 21

సంపద లారోగ్యమ్ములు
నింపును సంతోష మొంది నిజజీవితమున్
సొంపుగ బ్రతికెడు భాగ్యము
ఎంపిక నిడు కొంతమంది కీశుడు సూరీ ॥ 22

మృతకల్పునివోలె మనిషి
బ్రతుకుటకంటె నరకమ్ము మరి యుండదులే
గతజన్మ సంగతుల కగు
ప్రతిఫల మా గతిని యుండు పాపమె సూరీ ॥ 23

అనుకున్నది జరిగినచో
తనకంటెను ఘనుడు లేడు ధరణిని వేరే
అని తలచువారు మరతురు
కనిపించని దైవబలము ఘనతను సూరీ ॥ 24



పాలను మీగడ కంటెను
మేలగు చక్కెరనుకంటె మిక్కిలి రుచియై
ఏలు నిక రామనామము
కీలకమై తొలగజేసి కీడును సూరీ ॥

సమవర్తి లేక భేదము
యమపాశముచే నశువులు హరియించుననన్
సమయము వచ్చిన జీవులు
తమ ప్రాణమ్ములు విడువక తప్పదు సూరీ ॥ 26

విద్య యనంతము నేర్వగ
విద్యాజలనిధిని కలియు విజ్ఞాన నదుల్
విద్యయు పెంచు సుభిక్షత
విద్యను వయ సనక నేర్వ విధియే సూరీ ॥ 27

లేశంబు సంశయించక
ఆశించక ప్రతిఫలమును ఆవం తైనన్
చేసింది చెప్పకుండిన
భాసించును వారి యశము బాగుగ సూరీ ॥ 28

ఆటల, పాటల, చదువుల
రాటును దేలిన నటనను రాణింపు, సరే
దీటగు వృత్తుల నెల్లర
మేటిగ, నిలువగను పొందు మెప్పును సూరీ ॥ 29

కోరిక లేకున్న సుఖము
తీరిక లేకుండ పనులు తీరుగ జేయన్
దారికి రావచ్చు మనసు
తీరకపోయినను బుద్ధి తిరుగును సూరీ ॥ 30

సమ భావమ్మున జూడుము
సుమ! కష్టసుఖమ్ములంచు సూచించెనుగా
సుమధుర బోధన్ గీతన్
మమతా బంధము జయించి మనవలె సూరీ ॥

గత చేదు గురుతు లన్నియు
వెత పెంచును తీపివైన వెనుకటి కంటెన్
అతి మధురంబుగ తోచును
గతి తప్పిన మతి చెడును స్వగతమున సూరీ ॥ 32

అడుగుట కంటెను చెప్పుట
అడుగడుగున కష్ట మనుట అర్థంబగునే
వడివడి పని చేయించుట
కడు కష్టము చేయునపుడు కంటెను సూరీ ॥ 33

అధికార దాహ మొక కథ
అధికంబైన ధనదాహమా నాక కథయే
వ్యథ కల్గు కామ దాహము
కథ! యీ కథలకు ముగింపు కావలె సూరీ ॥ 34

న్యాయముకై పోరాడగ
మోయగలేని బరువెంత మోయుచు నున్నన్
న్యాయపథము వీడనపుడు
సాయము తప్పక దొరకుట సహజము సూరీ ॥ 35

కోపము పాపై కరవగ
శాపముగా మారి మనిషి సకలము మరచున్
తాపముతో మతి తప్పక
పాపమును తలపక తాను మనవలె సూరీ ॥ 36



నీతులు చెప్పుచు నెదురుగ
గోతులు తీయుదురు వెనుక కొందరు । వారే
రాతలు మార్చగ నెంతురు
భీతియు నొందకను వారు ప్రీతిగ సూరీ ॥ 37

పట్టుదలపట్టి గట్టిగ
తట్టుకొనుచు నెదురుదెబ్బ తగు ధైర్యంబున్
నెట్టుకు రాగల వారే
మెట్టుల నెక్కుచును పొందు మెప్పును సూరీ ॥ 38

పదవులు ఉన్నత మైనను
చదువులు పెద్దవి చదివిన చక్కని బుద్ధుల్
కొదవైన కొంద రెవరిని
కుదురుగ బ్రతుకంగనీరు కోరియు సూరీ ॥ 39

శృతి లేని పాట విన్నను
గతి తప్పిన పయనమైన కష్టము తోచున్
మతి లేని మాట లన్నను
వెత చెందును మానసమ్ము వింతగ సూరీ ॥ 40

మిత భాషణమ్ము చేయుట
హితమైనను మితముగ తిని హితమును తలపన్
వితరణ పరోపకారము
సతతము మేలు కలిగించు సత్యము సూరీ ॥ 41

పలుకులు కఱకుగ నుండిన
ములుకులవలె బాధపెట్టు ముందుగ మనలన్
పలుకులు మృదువుగ నుండిన
తొలకరి జల్లువలె మదికి తోచును సూరీ ॥ 42

కన్నంత తల్లి తండ్రికి
ఉన్నంతగ తృప్తి సంతు ఉన్నతి కనగా
విన్నంత మెండు తృప్తియు
తిన్నంతనె కలుగు తృప్తి తిరమగు సూరీ ॥ 43

బీడుకు మ్రోడుకు నీటిని
తోడిన మెండుగ చిగుర్చు తొలుతను కంటెన్
తోడు తగినవేళ దొరకు
నాడు పడినవాడు లేచి నవ్వును సూరీ ॥ 44

క్షీరము నీరము కలిసిన
తీరుగ మిత్రు లొకటిగను తిరముగ నుండన్
చేరుచునుందురు కొందరు
వేరును చెరచెడు పురుగుల విధముగ సూరీ ॥ 45

నిలిచినచోటనె నిలబడి
పిలచిన వెంటనె పలుకుచు పనులను చేయున్
తలచినతోడనె దైవము
ఇల కోరిక లన్ని తీర్చు నెప్పుడు సూరీ ॥ 46

ఊహల డోలిక లూగుచు
తాహతు మించిన తలపులు తగ దెవ్వరికిన్
సాహసము చేసి గుడ్డిగ
మోహమ్మున మునుగు టగును మూర్ఖత సూరీ ॥ 47

చెప్పుడు మాటలు వినుచో
తప్పుడు దారిని నడచుట తథ్యము సుమ్మీ
నిప్పును గొప్పకు ముట్టిన
నొప్పికలిగి తీరునంచు నుడివిరి సూరీ ॥ 48



గోక్షీరమ్మగు తెలుగా
పేక్షగ గ్రోలగ నభిరుచి పెంచును పరిధిన్
సాక్షాత్కరించి వాణియు
సాక్షిగ వాఙ్మయపు సొగసు చాటును సూరీ ॥ 49

మన తెలుగు భాష మధురము
మన సంస్కృతియే మహోత్తమంబని తెలియన్
మనమును మనమను మాటను
మనవారు మరచుట మంచి మాటయె! సూరీ ॥ 50

వినయంబున విద్య వెలుగు
ధనమును మించు సుగుణమ్ము ధరణిని వెలుగున్
కనబడు రూపము కంటెను
తన యంతఃకరణ వెలుగు తగినది సూరీ ॥ 51

కదులు అవివేకి మాటలు
వదులుగ నోటను । వివేకి వాడును హృదినే
పదిలముగ నుండు మాటలు
వదలక నిలబెట్టుకొనెడు పద్ధతి సూరీ ॥ 52

రోషము జయించుటకు నే
దోషము లెంచకను పరులతో సఖ్యతయే
ఔషధమై రోషమ్మును
శేషము లేకుండ చేయు చిత్రము సూరీ!! 53

వదలని ఆశయములతో
బెదరక విధి నిర్వహణను పెనగుట కంటెన్
మది దేశసేవ లేదని
కొదువయు కాదనుచు నమ్మగోరుము సూరీ ! 54

సాహిత్యసేవ, చేయగ
సాహసకార్యంబె యైన సాధ్యము కాదా?
ఊహకు నందని కృషిచే
ఓహో! యనిపించవచ్చు ఓర్పుగ సూరీ ! 55

ఉన్నతమగు ఆలోచన
లున్నట్టి మనుష్యులంత ఉత్తము లగుటన్
భిన్నముగ సంఘమందున
ఉన్న చెడును చీల్చివేయు చుందురు సూరీ !! 56

మందారము మకరందము
అందాల గులాబిలోని ఆ సున్నితమున్
ముందే మల్లె సుగంధము
విందే మధుపమున కంచు విదితమె సూరీ !! 57

క్షమియించు నీ వితరులను
క్షమియించును దైవ మింక కరుణను నిన్నున్
శమ దమ మార్దవము కృపయు
సమముగ గలవారె విమల చరితులు సూరీ !! 58

మాటలు కోటలు దాటిన
తూటులుపడగను మనసును దొలుచును మరి యా
మాటల మంచితనమ్మున
చేటు నివారించుట కడు శ్రేయము సూరీ !! 59

అనుకున్నది సాధించిన
ఎనలేని విధమ్ము తృప్తి యెదనిండుట తా
ననుభవముననే ఇతరుల
కనుల వెలుగు విలువ గాంచగలుగును సూరీ !! 60



జయమొంద సంశయించకు
భయమొందక శక్తికొలది పాటుపడుటయే
నయము జయాపజయమ్ములు
నియమించు నెపుడు విధాత నిజమిది సూరీ !! 61

గెలిచిన సంతసము కలుగు
తలచిన నోటమిని పొందు తప్పదు దిగులున్
కలుగుచు శుభాశుభమ్ములు
మలుచును జీవితము దైవ మహిమను సూరీ !! 62

ఒడిదుడుకుల యొరవడిబడి
గడబిడగను జీవితాంత గమనము విధితో
ముడివడి యుండ నడుగడుగు
తడబడక నడవడియుండ తగు నో సూరీ !! 63

మాటలు మేటిగ నోటను
ధాటిగ పలుకుటయె కాదు దయతో మనసా
మాటల నాడిన మోదము
సాటియు లేనంత కలుగు సత్యము సూరీ !! 64

కుటిలమగు రాజకీయము
జటిల సమస్యలను బాపు చాతుర్యమునన్
పటుతర బాధ్యతల నడుమ
కటువుగ మనవలెను నాయకత్వము సూరీ !! 65

ఎప్పుడు లంచము కోరక
గొప్పలకై ఆశపడక కోపించక నే
చెప్పుడు మాటలను వినక
తప్పుడు పనిచేయకున్న ధన్యులె సూరీ !! 66

కల్లాకపటము లేకను
ఉల్లాసమ్ముగ పలుకుచు నుత్సాహముగా
నెల్లెడల నుండువారల
నెల్లరు ప్రేమింత్రు కోరి నెయ్యము సూరీ !! 67

ఇనుము నయస్కాంతమువలె
జను లాధునికతను జూచి సమ్మోహితులై
కనుగానక చరియించుచు
వినరు హితము చెప్పిన నవివేకులు సూరీ !! 68

పంచుకొనంగను దుఃఖము
కొంచెము తరుగంగవచ్చు కోరి ముదమ్మున్
పంచుకొనిన రెట్టింపై
పెంచును బ్రతుకన్న నాశ ప్రేమయు సూరీ !! 69

అందరు శాశ్వత మందురు
సుందరమగు నాత్మనుండు శోభయె నిజమౌ !
కొందరు మహానుభావుల
డెందమ్ముల మరువలేము డిందిన సూరీ !! 70

వృత్తికి వైద్యులె ఐనను
మిత్తిని తరుమంగలేరు మేదిని వివరున్
విత్తము విపత్తు నాపదు
సత్తియ మిది నుదుటిరాత జనులకు సూరీ !! 71

మచ్చిక చేయుచు వచ్చియు
మెచ్చును మోసమ్ము నెంచి మిమ్ము బిగించున్
ఉచ్చున నమ్మకద్రోహులు
తెచ్చిన ముప్పిది చివరకు తెలియును సూరీ !! 72



పొగడినచో పొంగ తగదు
తెగడినచో క్రుంగతగదు తెలియంగవలెన్
తగురీతిని సమదృష్టిని
వగలేక జగమున మెలగవలయును సూరీ !! 73

మహిళాభ్యుదయము కోరుచు
సహనముతో పోరు సలిపి సాధించుచునే
మహదానందము పొందియు
అహమును జూపిన యనర్థ మబలకు సూరీ !! 74

చదువులు సమాన మైనను
పదవులును సమానమైన పతి యనగానే
అదలించు సతుల నెప్పుడు
అదనపు ఆధిక్యత తమ దంచును సూరీ !! 75

వానలు వరదలు వచ్చిన
కోనలు కాలినను ప్రజల కొంపలు కూలన్
మానవతా దృక్పథమున
దానము చేయుటయె తగిన ధర్మము సూరీ !! 76

సంసార సరోవరమున
హింస నెరుగకను సన్నిహితులై మెలగన్
సంసార నౌక హాయిగ
హంసవలెన్ సాగుచుండు హర్షమె సూరీ !! 77

రోజున్ వాసిం జూసియు
పూజకు పూలన్ని కోసి పోసిన రాశిన్
తాజూచి చెట్టు జాలిగ
నే జూడగ బోసిపోతినే యనె సూరీ !! 78

కడలిని కెరటము తానే
కడలియనగ నెగిరిపడును గర్వితు పగిదిన్
నుడువుచు గొప్పల నల్పుడు
కడు దర్పము చూపుచుండు ఘనముగ సూరీ !! 79

పూలవలె సున్నితముగను
పాలవలెన్ స్వచ్ఛమైన పసిహృదయములే
ఆలయములంచు దైవము
మేలుగ వసియించునందు మెచ్చుచు సూరీ !! 80

అవతారమూర్తుల మనుచు
అవని జనుల కార్తి దీర్చి ఆశలు రేపన్
అవధూతలు తామే యని
భువిమోసము చేయువారి పోల్చుము సూరీ !! 81

గురుచరణంబుల సేవయె
పరమ పవిత్రంబు తీర్థపానమె తమకున్
తరుణోపాయమ్మని మై
మరచుట తప్పిదముకాదె మహిలో సూరీ !! 82

కుహనాస్వాముల నమ్ముచు
ఇహాము మరచినట్టి వారు ఇతరము కనరే
సహజ హితంబేమి వినక
తహతహలాడుదురు గురువు దయకును సూరీ !! 83

నిత్యానందము కలుగుట
సత్యమ్మని నమ్మబలుకు సాముల చెంతన్
భృత్యులుగ జేరి మూఢులు
నిత్యము పూజించునదియె నేరము సూరీ !! 84



మురిపెము తోడను బిడ్డల
తిరిపెము నెత్తైన పెంచు తీరును కనమే
మరి యా మాతాపితరుల
సరితూగెడు వారు లేరు జగతిని సూరీ !! 85

వెన్నెల కన్నను చల్లన
మిన్నును మించిన విశాలమే యగు ననగా
వెన్నను మించిన మెత్తన
కన్నహృదయమని విశదము కాదా సూరీ !! 86

ధనమే మూలము జగతిని
మనసే ముఖ్యము మనుజుల మనుగడ కొఱకున్
ఘనమైన బ్రతుకు బ్రతికిన
తనువే శాశ్వతము కాదు ధరలో సూరీ !! 87

జలమును, వాయువు జీవుల
కిల ప్రాణాధారమైన కీలకములుగా
వలసిన జాగ్రత్తలతో
కలుషితమును జేయకుండ కావుము సూరీ !! 88

వాతావరణము కలుషిత
మేతావున జూడ నుండె మిత్తి విధమునన్
భేతాళప్రశ్న వేసిన
నేతలు మౌనమును దాల్చు నిజముగ సూరీ !! 89

ప్రజలకు నారోగ్యమె యగు
నిజమగు భాగ్యమను నీతి నేర్పిన నాడే
భుజియించుట వసియించుట
నిజమగు పద్ధతిని చేయనెరుగును సూరీ !! 90

ఎండయు వానల కోర్చుచు
మెండుగ శ్రమియించు సైన్య మిక కర్షకులున్
గండములు దాటుచుండిన
పండుగె యగుచుండు భరతమాతకు సూరీ !! 91

క్రోధములేకను, కొంతయు
బేధ మనక తల్లిదండ్రి బిడ్డల పెంచున్
బోధించ మంచి చెడ్డలు
సాధింతురు వారు ఘన విజయములు సూరీ !! 92

ముదిమిని సమస్య లెదురై
చెదిరిన మానసము పొందు చింతలు బాయన్
కుదురుగ ప్రార్థన చేసిన
ముదము కలిగి సూక్ష్మమగును మోక్షము సూరీ !! 93

సదుపాయమ్ముల నెంచక
తదుపాయమ్ముగను జీవితము సాగించన్
మృదువైన జీవన సరళి
తుది దినములు గడుచునంచు తోచును సూరీ !! 94

పాటల పల్లకి నెక్కుచు
మాటల గారడిని జేయు మత్తున మునగన్
చీటికి మాటికి అలజడి
నేటి తరము యువత తీరు నిజ మిది సూరీ !! 95

తృణమైనను పణమైనను
ఋణముండిన తీర్చదగిన రీతిని తెలుపన్
ఋణముండు తల్లి తండ్రికి
ఋణమా దైవము గురునకు ఋణమే సూరీ !! 96



కల దందురు ఋణ మింకను
కలిగిన సంతతికిని పశు గణములు పక్షుల్
తెలిసి వివాహపు బంధము
తెలియని గతజన్మ ఋణము తేలును సూరీ !! 97

వ్యక్తిత్వ వికాసమ్మును
శక్తిని పుస్తకపఠనము చక్కగ పెంచున్
రక్తియు నాసక్తియు అను
రక్తి కలిగి కీర్తిగాంచు రంతట సూరీ !! 98

పుస్తకము మంచి నేస్తము
మస్తకమును పదునుపెట్టి మనసును పెంచున్
వస్తువునుబట్టి విషయము
విస్తరణ నెరుంగ గలుగు విజ్ఞులు సూరీ !! 99

పరిమళము నిచ్చు విరులను
విరివిగ షడ్రుచులు నిండు విందును సప్త
స్వర రాగ విభావరులను
మరి పుస్తకములె వెలార్చు మహిమను సూరీ !! 100

తన పేరును శాశ్వతముగ
తనరారగ పుస్తకమ్ము ధన్యుల జేయున్
తన రచన మెప్పు పొందిన
మనసున నిండుగను పొంగు మధురిమ సూరీ !! 101

స్వీయావగాహనమ్మున
ఏయే యిబ్బందులైన నెదురించుటలో
స్వీయ క్రమశిక్ష ణాదులె
సాయుధ పోరాటమైన జయమే సూరీ !! 102

అప్పులు చేయుట నేర్చిరి
గొప్పగ నెల్లరును నేడు కోరిక తీరన్
తప్పనిసరి యని తదుపరి
తప్పు తెలిసినపుడు నొప్పి తరుగున? సూరీ !! 103

అవసర మైనప్పుడు మన
కవసర మైనంత ధనము కావలె ననగా
అవసరము మించు ఖర్చులు
సవరించి పొదుపుగ నున్న చాలును సూరీ !! 104

కాలము వేగము నాపగ
జాలము కాల గమనానుసారము జేయన్
జాలును మేలైన పనులు
కాలముతీరిన పిలుచును కాలుడు సూరీ !! 105

పుట్టుట గిట్టుటకు నడుమ
గట్టి పనులుజేసి సార్ధకత పొందవలెన్
పుట్టుక వరమ్ము తమకని
పుట్టగనే పరిమళించు పూవులు సూరీ !! 106

సాహిత్యమందు మమతను
మోహమున కవితలనల్ల ముచ్చట రావే
దేహమ్ము మేధశ్రమతో
సాహసముగ కలముపట్ట చాలునె సూరీ !! 107

పుడమిని ఎరువులు వేసిన
తడవ తడవ పంట యధికతరముగ పండున్
విడువక పొత్తము చదివిన
కడు మంచి రచనలు తెచ్చు కల మిక సూరీ !! 108



కోటి రకమ్ముల విద్యలు
నేటి యువతరమ్ము కోరి నేర్చుచు వారే
మేటి యనగ పాటుపడుచు
పోటీ లక్ష్యమ్మటంచు పోరును సూరీ !! 109

తరములు మారగ నిక నం
తరములు మారున? కులము మతముపోరు నిరం
తరము కొనసాగు తరుణము
తరుము తరంగము కడలిని తరుగున సూరీ !! 110

హతమార్చును తండ్రి నొకరు
హతమార్చును తల్లి బిడ్డ యనకను ఇంకన్
హతమార్చు ప్రేమను పగను
మతి తప్పిన గతిని జేయు పసు లివి సూరీ !! 111

మన సంస్కృతి యేమైనది ?
మన సంఘము నేటి రీతి పతనము తగునా
మన విశ్వశాంతి కొఱకై
మనమే పూనవలె శాంతి ప్రతినను సూరీ !! 112

దాగవు సుమసౌరభములు
దాగక దైవాంశ మహిమ తప్పక తెలియున్
మూగునట భ్రమర భక్తులు
సాగుట చిత్రములు సృష్టి సహజము సూరీ !! 113

మెండుగ కీర్తి గడించియు
నిండు వినమ్రులుగ నుండు నిజమగు విజ్ఞుల్
దండిగ పండ్ల బరువుతో
నుండెడు వృక్షములబోలు నొద్దిక సూరీ !! 114

ఇసుకయు చక్కెర కలసిన
ఇసుక విడచి చీమ చక్కెరే తినురీతిన్
అసలైన మంచి గైకొని
వసుధను గల చెడు త్యజించవలయును సూరీ !! 115

ఇరుగు పొరుగు వారిళ్ళకు
తరచుగ పోయిన తగవులు తప్పక వచ్చున్
స్వరమును శృతి తప్పినచో
భరియించగ బాధగొలుపు పాటయు సూరీ॥ 116

సహనమ్ము ప్రేమ, శాంతికి
అహ మెప్పు దశాంతి చిహ్న మందురు, ఈశుం
డహ మున్న చోటు నిలువక
అహ మెరుగనివారి చెంత నడుగిడు సూరీ ॥ 117

రేయింబవళ్ళు కృషినిం
జేయంగ విజేతలయ్యు చిరకాలమ్మున్
ధ్యేయంబు వీడకుండిన
సాయముగను దైవ ముందు చక్కగ సూరీ ॥ 118

కరతాళ రవళు లన్ని ని
కరమైన విజయమున కిడు గౌరవ మనగన్
తరతరముల కీర్తి కరము
వరుస శుభాకాంక్ష లంద వరమే సూరీ ॥ 119

రంగు రుచియు వాసన పలు
భంగుల విరులను గ్రహించు భ్రమరమువలె స
త్సంగుల గుణముల సేవల
పొంగుచు కరుణించు దైవము నిజము సూరీ ॥ 120



అదుపుం జేయగ వచ్చును
మదపు కరిని, నాట్య మాడ పామును, సాధ్యం
బది కేసరిపై స్వారీ
మదిపై అదుపెంతొ కష్ట మందురు సూరీ ॥ 121

పగలు సెగలు రగిలినపుడు
వగలే మిగులును చెలిమిగ వదలిన తగవుల్
దిగు లుండ దెప్పు డెవరికి
తగు శాంతిగ బ్రతుకగలరు ధరలో సూరీ ॥ 122

పేరాశ పొందకుండిన
వీరావేశమ్ము పడక విధినే నమ్మన్
ధారాళమైన యిడుముల
పోరాడి గెలు పవలీల పొందును సూరీ ॥ 123

తన యాలు బిడ్డ నమ్ముట
తనయుడు తండ్రిని నరుకుట తగునే, మదియే
ధన దాహము పగ నగునా?
మన సంస్కృతి మంట కలుపు మనుజులె? సూరీ ॥ 124

వారిధి గాంభీర్యమ్మును
తారా పథమంత యున్నతమ్మును వరమై
భారత సంస్కృతి యుండగ
కోరి యనుసరించ శుభము గూడును సూరీ ॥ 125

కాలము మించక మునుపే
కాలుని రాకకును ముందు కాగల పనులన్
మేలుకొని యాచరించిన
మేలుకలుగు నెల్లరకును మేదిని సూరీ ॥ 126

మత మేదైనను మన అభి
మతమున పేరేమి పెట్టి ప్రార్థించ మదిన్
వెత దీర్చు దైవమొక్కటె
నతు లిడవలెను భక్తితోడ నమ్ముచు సూరీ ॥ 127

ఇద్దరు పిల్లలు ముద్దని
హద్దులు యేర్పరచుకొనుచు ఆడశిశువునే
వద్దనుచు రద్దు చేయుట
కద్దన పాపమును ఘోరకలియే సూరీ ॥ 128

అవధులు లేనట్టి కృషియు
అవసరమగు ధైర్య మాశయమ్ములు తీర్చున్
అవని నసాధ్యము లేదని
ధృవపరచిరి పెద్ద లంత దృఢముగ సూరీ ॥ 129

చేతుల గీతల రీతిని
జాతకమును చెప్పుచుంద్రు! చతురాననుడే
చేతలను విధిగ వ్రాసిన
రాతలు మార్చగ నెవరి తరంబగు సూరీ ॥ 130

ఈసు నసూయలు లేకను
చేసిన పూజలు సఫలము చేయును దయతో
ఏసును, అల్లా, మరిహరి
దోసము లెంచకను బొందు తృప్తిని సూరీ ॥ 131

సేద్యము చేసిన లాభము
వాద్యము నేర్చిన ఫలితము వచ్చును కానీ
చోద్యమ్మె మద్యమును నై
వేద్యము గైకొన్న మిగులు వేదనె సూరీ ॥ 132



సుధ లూరించినను తొలుత
మధుపానము దురలవాటు మరువగ తగదే ।
వ్యధ బాపు నంచు మొద లిడి
కథ దుఃఖాంత మగుచుండక నమో సూరీ ॥ 133

కోరికలే గుర్రాలై
ఆరాటం బధికమైన అదుపుం దప్పున్
పేరాశ వీడి కళ్ళెము
మారాడక వేయవలెను మనసుకు సూరీ ॥ 134

ఇల మండుచుండ విడిగా
జలమౌ నాక్సిజను హైడ్రొజను జత కూడన్
తొలి సహజ లక్షణమ్మును
జలమై కోల్పోవు నదియె శాస్త్రము సూరీ ॥ 135

ఇసుమంత కలసి సున్నము
పసుపును పారాణియైన పగిదిన్ బ్రతుకున్
వసుధ సతీపతు లొకటై
కొసవరకును కోరుకొనుట గొప్పగు సూరీ ॥ 136

ఘనుడును విధి వక్రించిన
తన యాధిక్యతను బాసి తాపము చెందున్
ఇనుడే గ్రహణము పట్టిన
తన తేజము కోలుపోక తప్పదు సూరీ ॥ 137

ఓడలు బండ్లగు, బండ్లును
ఓడలగును కాలమహిమ ఓరిమితోడన్
జోడైన కష్టసుఖమ్ములు
నీడల సమభావనమ్మె నీ విధి సూరీ ॥ 138

నూరేళ్ళపంట పెండ్లని
ఏ రోజులలోని మాట? ఏ మగుచుండెన్?
వారూ వీరూ వేరా
ఆ రోజులు మారె నేడు ఔరా సూరీ ॥ 139

ఒప్పే యితరుల నమ్ముట
తప్పే గుడ్డిగను నమ్మ తరుణము నెవరిన్
ముప్పే వాటిల్లు మనకు
నొప్పే మిగులంచు తెలియును తుదకు సూరీ ॥ 140

తక్కువ కాదే మే మని
హక్కులకై తరుణు లాగ్రహమ్మును చూపన్
బిక్కమొగమ్ముల పురుషులు
దిక్కులు చూడకను తప్ప దింకను సూరీ ॥ 141

పదవి నధికార ముందని
మద మాత్సర్యముల జూపు మనుజుల నెపుడున్
ఎదురొడ్డగ ధైర్యంబును
నెద నిండుగ కలిగియుండ నేర్చుము సూరీ ॥ 142

సారము నెరిగిన చదువును
భారము కానట్టి బ్రతుకు, పరులకు మేలున్
కోరుచు నుపాధి కల్పన
తీరైన ఫలితము నిచ్చి తీరును సూరీ ॥ 143

తనయుడు తండ్రిని మించిన
తన శిష్యుడు తనను మించు తరుణము గనుచున్
ఘనముగ తండ్రియు, గురువులు
మనసున నాశీర్వదింత్రు మమతను సూరీ ॥ 144



దీపము కాంతిని పెంచగ
ఓపిక నందించి చమురు ఒత్తిని నిలుపున్
ఊపిరి యగు నాశయు కృషి
ఆపద, బాప యభివృద్ధి అందును సూరీ ॥ 145

తుల లేని విద్య వినయము
విలువను పెంచును నరులకు వేయి విధంబుల్
ఇలను పసిడికి పరిమళము
కలిగిన చందమున కీర్తి కలుగును సూరీ ॥ 146

బ్రతికున్న రోజు లన్నియు
బ్రతుకున నర్థము నెరుగుచు పరమార్థముకై
బ్రతికిన చరితార్థంబై
ప్రతిజన్మయు సార్థకతను బడయును సూరీ ॥ 147

పెద్దల సేవించినచో
కొద్దియు కొరవడక నన్ని కోర్కెలు తీరున్
పెద్దల ఆశీర్వాదము
పెద్దగ లభియించునట్టి పెన్నిధి సూరీ ॥ 148

మిద్దెలు మిన్నును తాకుట
సుద్దులు తోటలను దాట చోద్యమె సుమ్మీ
హద్దులు మీరని వర్తన
విద్దె వివేకములె నిత్యవిధులను సూరీ ॥ 149

వరకట్న దురాచారము
పెరిగి పిశాచిగ మనుజుల పీడించంగా
మరి హత్య లాత్మహత్యలు
జరుగుట గని యూరకుండ జాలునె సూరీ ॥ 150

కని విని ఎరుగని విధమున
ధనమును మాటను వివాహ తరుణము నందున్
మనమున తలపక మన మిక
మనసులు కలిసిన మనువుల మనవలె సూరీ ॥ 151

తేనెను మన కిడి మధుపము
మానవ రుధిరమును పీల్చి మశకము జేయున్
మానక మేలును, కీడును
కానగ రెండును విధాత కతమునె సూరీ ॥ 152

మానవులందున ద్వంద్వము
కానగ మధుపము, మశకము కరణిని కాదే
తానే సృజించు దైవము
ఏనాటికి లీల నెరుగ లేమిక సూరీ ॥ 153

ధరియించిన కాషాయము
ధరియించిన నలుపు మరియు ధవళాంబరముల్
అరిషడ్వర్గములను తా
నరికట్ట గలిగిన వారె అర్హులు సూరీ ॥ 154

అమ్మను మించిన దైవము
ఇమ్మహి వెదుకగ నితరము నెందును కనమే
అమ్మను మాటయె కమ్మన
అమ్మ తపన బిడ్డకొఱకె యగునే సూరీ ॥ 155

చాలిన చక్కెర తేనెయు
పాలుపెరుగు నేయి కలిసి పంచామృతముల్
మేలైన మనసు, సహనము
శీలము, విజ్ఞత కరుణ ప్రసిద్ధము సూరీ ॥ 156



పలుకుచు ప్రగల్భ శతమును
తలకును మించిన పనులను తలబెట్టంగన్
కలనైనను తగ దేరికి
అలవోకగ వచ్చు కష్ట మధికము సూరీ ॥ 157

తరులు విరులు రాల్చునపుడు
చిరునవ్వులు జల్లుగ కురిసినపుడు మదిలో
సిరులు ఝురులై దొరలగా
మురియుట పరమై లభించు ముదమే సూరీ ॥ 158

పాటకు పల్లవి ప్రాణము
ఆటకు పోటీయె ప్రాణ మగు నెన్నికలన్
ఓటే ప్రాణము సత్యమె
మాటకు మనిషికిని ప్రాణ మందురు సూరీ ॥ 159

రాముని రాజ్యము పూర్వము
కాముని రాజ్యంబు నేడు కానగవచ్చున్
రాముని పేరున చేతలు
మోమున కననీక వీరు మోసము సూరీ ॥ 160

పనియందు శ్రద్ధయుండిన
ఘనతను సాధించగలరు గణనీయముగా
కనమే పిచ్చుక శ్రమపడి
తన గూడును కట్టువిధము, తపనను సూరీ ॥ 161

భావకవితలను కవులున్
భావికి బంగారుపూలు ఫలముల్ పంచున్
తావిని కల్పించు కళల
కావాలనిపించు చిత్రకారులు సూరీ ॥ 162

'చదువుకొనుట' యవసరమే
'చదువు' 'కొనుట' కష్టముకద జనులకు నేడున్
చదువుల కర్థమె, 'అర్థమ'?
పదవుల? అర్థము నెరుంగవలయును సూరీ ॥ 163

ఆటైనను పాటైనను
పోటీపడి గెలిచినంత పొందును ఘనతన్
బూటక మాడిన తప్పదు
ఓటమి యే నాటికైన నుర్విని సూరీ ॥ 164

ఆడశిశువే వలదనుట
కూడదు సుమ్మీ! మనసున కూతురు కొడుకున్
కూడను సమానప్రేమను
చూడగలుగుటయె మంచి సూత్రము సూరీ ॥ 165

నవజీవితాశయమ్ముల
నవరసభరితముగ జీవనమ్మును గడుపన్
నవ్యప్రయోగమ్ములతో
నవమార్గము ననుసరించి నడువుము సూరీ ॥ 166

ఆశ నవిరళ కృషి సలుప
ఆశయసిద్ధి లభియించు ననితర రీతిన్
క్లేశమును బాసి కష్టము
లేశమ్మును లేకనుండు లేమియు సూరీ ॥ 167

ఆనతి నీయగ భారతి
'సూనృతములను' లిఖియించు సూరీ! యని నా
మానస సరోవరమ్మున
కానుక కమలములు విరిసె కందము లగుచున్ ॥ 168